# రాజాది నవనాయక నిర్ణయము

చైత్రాదిమేషహరికర్కట చాపయుగ్మ రౌద్రర్క్ష తౌళి మకరోదయ వాసరేశాః /

రాజశ్చ మంత్రి భటనాయక సస్యనాథ దాన్యార్ఘ మేఘ రస నీరసేశా క్రమేణ //

1.వత్సరాది వారాధిపతి = రాజు

2.మేష సంక్రమణ వారాధిపతి = మంత్రి

3.సింహ సంక్రమణ వారాధిపతి = సేనాధిపతి

4.కర్కాటక సంక్రమణ వారాధిపతి = సస్యాధిపతి

5.ధనుస్సంక్రమణ వారాధిపతి = ధాన్యాధిపతి

6.మిథున సంక్రమణ వారాధిపతి = అర్ఘాధిపతి

7.ఆర్ద్ర ప్రవేశ వారాధిపతి = మేఘాధిపతి

8.తులా సంక్రమణ వారాధిపతి = రసాధిపతి

9.మకర సంక్రమణ వారాధిపతి = నీరసాధిపతి

సేన, ధాన్య, అర్ఘ, మేఘ, నీరసాదిపతుల విషయంలో రాత్రి సమయంలో సంక్రమణ జరిగితే, ప్రవేశ దినమున రాత్రి యందు నిశి ప్రమాణమును మూడు భాగములు చేయగా ప్రవేశ సమయము మొదటి రెండు భాగములైన పూర్వదిన వారాదిపతిగాను, మూడవ భాగమైతే పరదిన వారాధిపతిగాను చూడవలెను.రవి (మేష) సంక్రమణము అర్ధరాత్రి అనంతరము వచ్చినపుడు ముందు వారాదిపతిని మంత్రి, సస్యాదిపతులుగాను తెలియవలెను.(పురోహిత దర్శిని అను జాతకాలంకారము రచయిత: గోరస వీరభద్రాచార్యులు -25 వ పేజీ )

# పశుపాలకాది నిర్ణయము

1.పశుపాలకుడు= చైత్ర శు// 1 నాటి వారాధిపతి (వర్షాధిపతి)

2.గోష్ట ప్రాపకుడు= ఆర్ద్రా ప్రవేశ వారాధిపతి (మేఘాధిపతి)

3.గోష్ట బహిష్కర్త = మిథున సంక్రమణ వారాధిపతి (అర్ఘాధిపతి)

పశుపాలకుడు, గోష్ట ప్రాపకుడు, గోష్ట బహిష్కర్త

రవి, కుజుడైన =యముడు

బుధ, శనులైన = బలభద్రుడు

గురు, శుక్ర, చంద్రులైన = గోపాలుడు (గోష్ట ప్రాపకుడి విషయంలో శ్రీకృష్ణుడు) (26 వ పుట)

# ఆఢక (వర్ష) నిర్ణయము

1.రవి, కుజులు రాజులైన = 2 కుంచములు (తూములు)

2.బుధ, చంద్రులు రాజులైన = 3 కుంచములు (తూములు)

3.గురు, శుక్రులు రాజులైన = 4 కుంచములు (తూములు)

4.శని రాజైన = 1 కుంచము (తూము)

## ఆదాయ వ్యయ నిర్ణయము

రావ్యాది గ్రహముల ద్రవములు - రవి 6, చంద్ర 15, కుజ 8, బుధ 17, గురు 19, శుక్ర 21, శని 10. అబ్దాధిపతి ధృవం, రాష్యాధిపతి ధృవం ఈ రెంటిని కూడి 3 చే గుణించి, 5 చేర్చి, 15 చే భాగించిన శేషం ఆదాయం. ఆదాయ లబ్దమును 3 చే గుణించి, 5 కలిపి, 15 భాగించగా మిగిలిన శేషం వ్యయం.

శ్లో//ఆదిత్య షట్కం దశపంచ చంద్రే భౌమాష్ట సంఖ్యా దశసప్త సౌమ్యే /

ఏకోనవింశత్సురరాజ మంత్రీ శుక్రేకవింశంచ శనిర్దశంచ //

శ్లో// రాశి సంవత్సరేచైక్యం త్రిగుణం శర సంయుతం పంచాదశ హరేద్భాగం శేషమాదాయ నిర్ణయం /

తల్లబ్దం త్రిగుణే కృత్వా బాణసంఖ్యాయుతం పదం పంచాదశ హరేద్భాగం శేషంతు వ్యయమాదిశేత్ //(పుట 29)

## రాజ పూజావమానం

అబ్దాధిపతి ధృవం, రాశి ధృవం ఈ రెంటిని కూడి, ఆ సంఖ్యను 3 చే గుణించి 5 చేర్చి 7 చే భాగించగా మిగిలిన శేషం రాజపూజ, లబ్దమును 3 చే గుణించి 5 చేర్చి 7 చే భాగించగా మిగిలిన శేషం అవమానం అగును.

## కందత్రయ ఫల నిర్ణయము

శ్లో// చైత్రాది తిథివారేణ కరణాద్యోగ తారకం /

జన్మ నక్షత్ర సంయుక్తం తథా త్రిస్థాపితం పదం //

పుర శైల కులఘ్నంచ వసువహ్ని శరైర్హృతం /

లబ్దం విన్ను శ్యతచ్చేశం కందాయత్రయ ముచ్యతే //

ప్రత్యబ్దమందు చైత్ర శుక్ల పాడ్యమి దినమున సంభవించు తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ సంఖ్యలకు వారి వారి జన్మ నక్షత్ర సంఖ్య కూడగా వచ్చునది పదమనబడును. పదమును 3 చే గుణించి, 8 చే భాగించగా మొదటి కందాయం, 7 చే గుణించి 3 చే భాగించగా రెండవ కందాయం, 3 చే గుణించి 5 చే భాగించగా మూడవ కందాయం వచ్చును. మొదటి కందాయం వరుసగా 1,4,7,2,5,0,3,6, రెండవ కందాయం 1,2,0, మూడవ కందాయం 1,4,2,0,3(1,3,0,2,4) అగును.

## చంద్రోదయ సాధన

శుక్ల పక్షమున సూర్యాస్తమయపూర్వం చంద్రోదయం, సూర్యాస్తమయానంతరం చంద్రాస్తమం అగును. కృష్ణపక్షమున సూర్యాస్తమయమునకు ముందే లేక సూర్యోదయానికి ముందే చంద్రాస్తమం, సూర్యాస్తమానాత్పరం చంద్రోదయం అగును. రాత్రి ప్రమాణమును తిథిచే గుణించి, అందు శుక్లపక్షం అయితే 2 కలుపగా, కృష్ణపక్షం అయితే 2 తీసివేయగా వచ్చిన సంఖ్యను 15 చే భాగించగా వచ్చు లబ్దము ఘడియలు, శేషమును 60 చే గుణించి 15 చే భాగించగా వచ్చు లబ్దము విఘడియలగును.

## చంద్రోదయ శృంగం

శ్లో//మీనమేషోదయే చంద్రే సతతం దక్షిణోన్నతం /

శేషరాశ్యుత్తర శృంగం సమం స్యాద్వృషకుంభయోః //

మీన, మేష సంక్రమణలయందు దక్షిణ శృంగోన్నతి, వృషభ, కుంభ సంక్రమణలయందు సమ శృంగోన్నతి, మిగిలిన రాసులందు ఉత్తర శృంగోన్నతి.

## అర్ఘ నిర్ణయం

శ్లో//అశపూర్వ మనర్ఘంచ ఉచిమూలే సమం తథా /

శేషం షోడశ నక్షత్ర మత్యర్ఘం శశి జాయతే //

## వర్ష ప్రమాణ నిర్ణయము

శ్లో//యస్మిన్వారాధిపో రాజా ఆఢకాధిపతిస్సచ /

చతురాఢం గురుభృగౌ త్రిరాఢం చంద్ర చంద్రజౌ/

ద్విరాఢం రవిభౌమేచ ఆఢమేకం శనైశ్చరే // (సిద్ధాంత సరళి- నిమ్మగడ్డ వేంకట శివరామబ్రహ్మ శాస్త్రి -130 పుట)

## పశుపాలక (పశునాయక) నిర్ణయము

1.పశుపాలకుడు, 2.గోష్టాగార ప్రాపకుడు (స్థానసంరక్షకుడు), 3.గోష్టాద్బహిప్రాపకుడు

శ్లో// భానుర్భౌమో యమోరాజా బలభద్రో బుధేశనౌ /

గురుభార్గవసోమాశ్చ గోపాలః పశునాయకః // (పుట 151)

## గోష్టాగార ప్రాపకుని నిర్ణయము

శ్లో// ఆర్ద్రాప్రవేశ వారేశౌ భాను భౌమాచ ప్రేతరాట్ /

భృగ్వింశదోశ్చ గురౌ కృష్ణో బలభద్రే బుదే శనౌ // (పుట 151)

## కందాయ నిర్ణయము

ఖం= ఆకాశమందున్న నక్షత్రములు, దాయఫలం= ఇచ్చు ఫలం. "ఖందాయ ఫలం" అనునది వ్యవహారంలో "కందాయ ఫలం" గా మారింది. "కంసుఖేవ్యోమ్ని" అని ఉండుటచే, కం= సుఖమును, దాయ= ఇచ్చునది, కావచ్చును. (పుట 268)

## కందాయములను కనుగొను పద్ధతి

శ్లో// చైత్రాది తిథివారర్క్షం యోగం కరణ సంయుతం /

జన్మ నక్షత్ర సంయుక్తం ఇత్యేతే ధ్రువ లక్షణం //

గుణ శైల పురా నిఘ్నం వసు వహ్ని శరైర్హతం /

లబ్దం విమృశ్య తచ్ఛేషం కందాయ త్రయ ముచ్యతే //

నిఘ్నం = గుణించుట ; హతం = భాగించుట (పుట 269)

## కందాయ సంఖ్యా క్రమాలు

అశ్విన్యాది రేవత్యంతం ప్రతి నక్షత్రం వారికి కందాయ గణితం చేయుట ప్రయాసయై యున్నందున పెద్దలు ఈ దిగువ రీతిని మూడు కందాయ సంఖ్యా క్రమములు నిరూపించియున్నారు . ఆ సంఖ్యలు నియతములు.

శ్లో// చంద్రాబ్ధి శైల నేత్రాణి బాణాకాశాగ్ని శాస్త్రకం /

చంద్ర నేత్ర వియచ్చంద్ర వేద లోచన ఖాగ్నికం /

త్రిషు స్థానేషు సంయోజ్య కందాయజ ఫలం వదేత్ //

సంయోజ్య = కలిపి (సంయుతం)

చంద్ర = 1, ఆకాశ, ఖ, వియత్=0 (పుట 271)

మొదటి కందాయం = 1, 4, 7, 2, 5, 0, 3, 6

రెండవ కందాయం = 1, 2, 0

మూడవ కందాయం = 1, 4, 2, 0, 3

అక్షర సంజ్ఞా క్రమమున కందాయ క్రమం

"కాదిర్నవో, టాదినవో, పాదిపంచ,చ యాష్టకమ్" అనే అక్షర సంఖ్యా నిర్ణయ సూత్ర ప్రకారం (న=0)

మొదటి కందాయం = అవసరమానగతా = 1, 4, 7, 2, 5, 0, 3, 6

రెండవ కందాయం = పేరన = 1, 2, 0

మూడవ కందాయం = కంభంరానాగా = 1, 4, 2, 0, 3 (పుట 273)

## ఆదాయవ్యయ గణిత పద్ధతి

స్వస్వామి వర్షాధిప వత్సరైక్యం త్రిఘ్నం శరాఢ్యంతిధి భక్త శేషం /

ఆయోz ధ లబ్ధి స్త్రిగుణా శరాఢ్యా తిథ్యుద్ధృతా శేషమితో వ్యయస్స్యాత్ // (పుట 275)

## గ్రహ సంఖ్యా నియమము

శ్లో// ఆదిత్య షట్కం దశపంచ చంద్ర భౌమాష్ట సంఖ్యా దశసప్త సౌమ్యే /

ఏకోనవింశత్యమరాధి మంత్రీ శుక్రైకవింశంచ శనిర్దశైవ // (పుట 275)

ఇది అష్టోత్తరీ దశా పద్ధతిలో చేరినది. స్వస్వామి మరియు వర్షాధిపతి ద్రవ సంఖ్యలు పై విధంగానే గ్రహించాలి.

## రాజపూజావమాన నిర్ణయం

శ్లో// రాశిసంఖ్యా నృపశ్చైక్యం త్రినిఘ్నం బాణ సంయుతం /

మునిభిర్భాజితం శేషం రాజపూజ్యమిహోచ్యతే // (పుట 177)

తల్లబ్ధం పుర నిఘ్నంచ పంచ సంఖ్యాయుతం పదం /

మునిభిర్భాజితం శేషం అవమానమితి స్మృతం // (పుట 178)

గ్రహసంఖ్యలు = పైవిధంగానే, రాశిసంఖ్యలు = రాశి క్రమ సంఖ్యలు

## అధికమాస నిర్ణయము

శ్లో// ద్వాత్రింశద్భిర్గతైర్మాసైర్దినైః షోడశభిస్తథా /

ఘటికానాం చతుష్కేణ పతత్యధికమాసకః //

గతాధిక మాసమునకు 32 మాసముల 16 దినముల 4 ఘడియలకు మరల అధికమాసము వచ్చుననుట సర్వ సాధారణ విషయము.

శ్లో// శాకే బాణ కరాంకకే విరహితే నందేందుభిర్భాజితే /

శేషేz గ్నౌచ మధుశ్చ మాధవ శివే జ్యేష్టశ్చ ఖేచాష్టకే //

ఆషాఢో నృపతే నభశ్చ శరకే భాద్రశ్చ విశ్వాంకకే /

నేత్రే చాశ్విన కోz ధిమాస ఉదితోశేషేన్యకేస్యాన్నహి //

వర్తమాన శకాబ్దములందు 925 తివిచగా వచ్చు మొత్తమును 19 చే భాగించగా వచ్చు శేష సంఖ్య 3 అగుచో చైత్రమాస మదికమనియు, 11 అగుచో వైశాఖమనియు, 0 గాని 8 గాని అగుచో జ్యేష్టమనియు, 16 అగుచో ఆషాఢమనియు, 5 అగుచో శ్రావణమనియు, 13 అగుచో భాద్రపదమనియు, 2 అగుచో ఆశ్వయుజమనియు గ్రహించవలెను. మిగిలిన అంకెలు అనగా 1, 4, 6, 7, 9, 10, 12, 14, 15, 17, 18 సంఖ్యలలో ఏది శేషముగా వచ్చినను అధికమాసం కలుగదని గ్రహించాలి ఇది స్థూల మార్గమే కాని సూక్ష్మ మార్గం కాదు. (పుట 184)

## క్షయమాస లక్షణము

ఒక  చాంద్రమాసములో రెండు సౌరసంక్రాంతులు కలిగినను లేక సంక్రాంతి ద్వయ మధ్యమున అమావాస్యాంతము లేకపోయినను ఆ చాంద్రమాసము లుప్త (క్షయ) మాసమనబడును. ఆ ఏటిలో రెండు అధికమాసములు ఆ లుప్త మాసమునకు వెనుక, ముందు కలుగుచుండును. మార్గశిర, పౌష్య, మాఘ మాసములలో ఏదైనా క్షయమాసముగా వచ్చును. క్షయమాసముగల సంవత్సరమునందు వచ్చు అధిక మాసములే కార్తీక, ఫాల్గుణములై ఉండును. కాని మూడు సంవత్సరమలకొకసారి వచ్చు అధిక మాసములు కార్తిక, ఫాల్గుణములై ఉండవు. (పుట 190)

## చైత్రాది మాసములకు వైదిక నామములు

శ్లో// చైత్రమాసో మధుః ప్రోక్తో వైశాఖో మాధవో భవేత్ / జ్యేష్ఠ మాసస్తు శుక్రః స్యాదాషాఢః శుచిరుచ్యతే //

నభో మాసః శ్రావణస్యాన్నభస్యో భాద్ర ఉచ్యతే / ఇషశ్చాశ్వయుజోమాసః కార్తికశ్చోర్జ సంజ్ఞకః //

సహోమాసో మార్గశిరః సహస్య పుష్యనామకః / మాఘమాసస్తపాః ప్రోక్తస్తపస్యః ఫాల్గుణః స్మృతః // (పుట 93)

## ప్రత్యబ్ద నవనాయక నిర్ణయము

శ్లో// చైత్రాది మేష హరి కర్కట చాపయుగ్మ/రౌద్రర్క్ష తౌళి మకరోదయ వాసరేశాః //

రాజాచ మంత్రి భటనాయక సస్యపాశ్చ / దాన్యార్ఘ మేఘ రస నీరసపాః క్రమేణ //

శ్లో// మేష సంక్రమణే మంత్రీ వృషభేతు పురోహితః / మిథునేz ర్ఘాధిపతిశ్చైవ మేఘాధిపతిరేవచ //

సస్యాధిపతిస్తు కటకే సింహే సేనాధిపస్తథా / పరీక్షకస్తు కన్యాయాం తులాయాంతు రసాధిపః //

వృశ్చికే గ్రామపాలశ్చ చాపే ధాన్యాధిపస్తథా / మృగేతు నీరసాధీశో కుంభే గణక ఏవచ //
మీనే దైవజ్ఞ ఇత్యుక్తౌ సంక్రాంతౌ వారపాః క్రమాత్ // (పుట 94)

## మంత్రి సస్య రాసాదిపతుల నిర్ణయ విశేషము

శ్లో// యదా సూర్యస్య సంక్రాంతి రర్ధరాత్రాదనంతరం / తదూర్ధ్వ వారపో గ్రాహ్యో మంత్రీసస్యరసాధిపాః //

## సేన దాన్యార్ఘ మేఘ నీరసేశ్వరుల నిర్ణయ విశేషము

శ్లో// సేన దాన్యార్ఘ మేఘేశ నీరసేశ్వర పంచసు / రాత్రౌ త్రిభాగం కుర్వీత ద్వౌ భాగౌ పూర్వ వాసరే //
శేష భాగం పరదినే వారనాథో లిఖేత్క్రమాత్ //

శ్లో// సచివస్సస్యపో మేఘ రసనీరస ధాన్యపాః / అర్ధరాత్రమతి క్రాంతా భవంత్యుత్తర వారపాః //
----నారదీయే (పుట 95)

## ఉపనాయక నిర్ణయము

శ్లో// అశ్వానామధిపో మేషే గజేశశ్చ వృషాతథా / పశూనామధిపో యుగ్మే దేవాధీశస్తు కర్కటే //
నరాణామధిపో సింహే కన్యాయాం గ్రామనాయకః / వస్త్రాధీశస్తులాయాంస్యాత్కీటేరత్నాధిపో భవేత్ //
వృక్షాధికారి ధనుషి జంగమాధిపతిర్మృగే / సర్పాణామధిపః కుంభే మృగాణామధిపోఽత్యజే //
జగల్లగ్నాధిపో మేష సంక్రమారంభ వారపః / శుభాధిపో వత్సరాదౌ స్త్రీణామార్ద్ర ప్రవేశనే //
వృష మిథున కన్యకాళీ కర్కట మీనేషు దినాధిపాః క్రమేణ / కోశ రణ భట్రాజా వ్యవహారా వ్యాపారేశాః //
కుంభ మీనాయనే వర్ష తటాకాది పతీః క్రమాత్ // (పుట 96) (అళీ = వృశ్చికం )

(సంకలనం : డి.నారాయణ రావు, విద్యానగర్, హైదరాబాదు 500044)